* అంకితం *

సంగీత సాహిత్యాలు మూర్తీభవించిన

పుంభావ సరస్వతి

శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారికి

# సూచిక

# ప్రకాశిక

కాలం ఎప్పుడూ ఒకే తీరుగా ఉండదు. దినదినం తిథివార నక్షత్రాలు మారిపోతూ వుండటమే అందుకు ప్రత్యక్షనిదర్శనం. కాలం చక్రం లాంటిది, క్రిందుమీదులు మీదుక్రిందు లౌతూ వుంటవి. ఈ స్వభావాన్నుంచి నైహా లగినిలువ గలిగే పదార్థం ఈ సృష్టిలో లేదు, ఒక్క దేవుడు తప్ప. అందువల్ల సాహిత్యమూ అంతే. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్కటి ప్రధానమై పరిపాలిస్తున్నట్లు కనిపిస్తుంది. పురాణేతిహాసాల తరువాత భారత దేశాన్ని కొంతకాలం నాటకం పరిపాలించినది. తరువాత కావ్యం. తెలుగు దేశంలో శ్రీకృష్ణదేవరాయలవారి కాలాన ప్రబంధం ప్రభుత్వం చేసింది. మొన్నమొన్నటి మన స్వాతంత్ర్యోద్యమం నాటి నుండి ఏ ఒకదానికో ప్రభుత్వం కట్టిపెట్టకుండా అన్ని రకాల సాహిత్యం దాదాపొకే విధంగా చలామణికి రావటం ప్రారంభించింది. ఇందులో కవిత్వం కూడ ఒకటి. కాని నేటి కాలంలో ప్రాధాన్యం వహిస్తూవున్న సాహిత్య ప్రక్రియల్లో నవల, కథ, నాటిక, కవిత ఈ నాలుగు కనిపిస్తున్నవి. వాటి ప్రచార బాహుళ్యం కూడా పై క్రమంలోనే వుంది.

కవిత నేడు రెండు రకాలుగా వుంది. పద్యకవిత, గేయకవిత అని. పద్యకవిత సాంప్రదాయకమైన మార్గం లోనిది. గేయకవిత జానపద మనబడే దేశీయమైన మార్గం లోనిది. దీనికి మొన్నమొన్నటి దాకా సంఘంలో అంతగా

గౌరవం లభించలేదు. ఇది గౌరవనీయం కావటానికి కూడా హేతువు మన స్వాతంత్ర్యోద్యమం లోని దేశీయాభిమానం. అయితే ఈ దేశీయమైన గేయమార్గం శిష్టుల చేతిలో మొదటి నుంచీ లేక పోవడం వల్ల, సాంప్రదాయికమైన పద్యకవితా మార్గంలో వున్న పుష్టీతుష్టీ రెండూకూడా లేనిదై పోయింది. అలాంటి స్థితిలోవున్న గేయమార్గాన్ని పట్టుకొని శిష్ట సంపన్నం చేయాలని స్వామీ శివశంకరుల నుండి దేశంలో కొంత ప్రయత్నం బయలు దేరింది. ఈ ప్రయత్నం పుష్కలంగా చేసిన శ్రీశ్రీ ఒకఏదో ప్రయోజనం ఆశించి మరో ప్రక్కగా గేయాన్ని తీసికొని పొయ్యాడు. పద్యకవితా ప్రయోజనం ఏమిటో దాన్నే గేయరూపాన సాధించే ప్రయత్నం పుష్కలంగా చేస్తూవున్న యువ కవులలో శ్రీ. సి. నారాయణరెడ్డిగారొకరు. ఇంతకు పూర్వమే ఈయన ఈ గేయరూపాన రెండు మూడు కథాకావ్యాలు ప్రచురించారు కూడాను. ఆయన అప్పుడప్పుడూ వ్యస్తంగా వ్రాసిన గేయాలను—(పత్రికల్లో ప్రచురింప బడినవి—పడనివీ) కొన్నింటిని కలిపి దివ్వెలమువ్వలు అనే పేరుతో ఖండ కావ్యంగా ప్రచురిస్తున్నాము.

ఇక ఈఖండకావ్యం గురించి రెండు మాటలు. ఇది ఖండకావ్యం గనుక ఏశీర్షికతో వున్న ఖండిక, అంతవరకే పరిమితమైన ఆద్యంతాలు కలిగిన భావంగా వుంటుంది. అందువల్ల ఈ సృష్టిలోవున్న ప్రతి వస్తువు ఖండకావ్య కవికి

విభావమే అవుతుంది. అంటే శారదాదేవి నుండి జైల్లోపడ్డ మనిషి వరకూ అన్నమాట. ఖండకావ్యంలోని విభావాలు కవియొక్క భూషణ దూషణలకు ఆస్కార మవుతూ వుంటవి. కవియొక్క భూషణదూషణలు చమత్కారగర్భాలు కానటంవల్ల అవే కవిత్వంగా సహృదయ హృదయాలకు ప్రమోదాన్ని చేకూరుస్తవి.

శ్రీ నారాయణరెడ్డిగారి ఖండకావ్యంలో అనేక విభావాలను భావించారు. అందులో "ఉదయోన్మాదులు" అన్న శీర్షికలో గోవావిముక్తికోసం జైత్రయాత్ర సాగించిన భారత వీరులను గూర్చి

నీరధివలె ఉప్పొంగిన
నియంతృత్వమశ్శక్తిని
అమాంతముగ మ్రింగివేయ
అగస్త్యులైనారు వారు
అజేయులై తీరుతారు———అనీ

ప్రత్యేక రాష్ట్రమునూ—అందునూ విశాలాంధ్రనూ కావాలని కాంక్షించి ఆందోళన చేసి సాధించుకొన్న ఆంధ్ర జనతను ఏకాకృతిగా చేసి ఆవాని తృప్తిని.

గగన పుష్పమనుకొన్న రాష్ట్రమది
కనులముందు వికసించె
శశవిషాణం అనుకున్న ఆశయం
విశాలాంధ్ర సిద్ధించె———అనిన్నీ

తెలంగాణా ప్రసిద్ధ పురుషులలో ఒకరై, తెలంగాణా సాహిత్యక్షేత్రంలో, అనేక పుష్పాలను పుష్పింపజేసి, అజరామర కీర్తి గాంచి, కీర్తిశేషులైన శ్రీసురవరం ప్రతాపరెడ్డి గారిని గురించి—అక్షరాంజలిలో—

ఆతని వైదిక జాతకమునకు
అచ్చిరానిది ఒకే యొక్కటి
అదే ఊసరవెల్లి పాత్రకు—
అనుగుణమ్మగు రాజకీయము

అనీ—అంటారు.

ఇలాంటి ఉత్కృష్టమైన ఖండికలతో నిండిన ఈఖండకావ్య సంపుటిని మాకు ప్రచురించుటకు అనుమతి నిచ్చిన శ్రీనారాయణరెడ్డిగార్కి ఆదిలో వారిని మాకు పరిచయం చేసిన మాబాల్య ఆప్తమిత్రులు శ్రీరామకోటి శాస్త్రి గారికి మా కృతజ్ఞత తెలియపర్చుకుంటున్నాము.

ఇట్లు,

కప్పగంతుల మురళీకృష్ణ.

# దివ్వెల మువ్వలు

కదలనేర్చినట్టి మట్టిగాదెయైన నా తనువున
సిరాపథములంటి ప్రాకె చిత్రమైన కాంతిలహరి.

అధి భౌతికమ్మగు నా యీ దేహ వితర్దిపైన
గజ్జెకట్టె అధియాజ్ఞికమ్మగు రూపమ్మేదో?

దివ్వెల మువ్వలతో నర్తించు జగన్మోహిని యది.
ఆత్మకు మాత్రమె దృశ్యమ్మగు అక్షరవాహిని యది.

ఆయమ కెంగేలిమ్రేళ్ల అలలై పింపిళ్లవోయి
కడిగివేసినవి నాలో విడిదిచేసిన తమస్సుల.

అపుడెగిసెను నా మనస్సు హవిరుద్గత ధూమమట్లు
అపుడె చేపె నాదు అంతరాత్మ కామధేనువట్లు.

బ్రహ్మాండము ప్రమిదవోలె భాసించెను; దానిలోన
స్నేహామృతవర్తి ప్రకాశించెను పరమాత్మ లీల.

ఓ దివ్వెల మువ్వలదానా! దివ్యత్వనిధానా!
ఎల్లప్పుడు నాలో ఇటులేల గజ్జె కదలించవు?

## 10

వత్సరమున కొక్కమారువచ్చి నన్ను పట్టి పిచ్చి
వానిగ జేసెదవేలా? ఓనా రోచిర్మాలా!

నీ వ్రేపల తళత్తళలు నిత్యము కన్పించినచో
మాయాంధమ్మైన బ్రతుకు మహితకాంతి గోళమ్మగు.

నీ మువ్వల ఘలంఘలలు నిత్యము విన్పించినచో
మృణ్మయమౌ ఈ దేహము చిన్మయనాదాత్మకమగు.

19 అక్టోబరు 1957

# ఊర్మిళ

కడసందె వెన్క చంద్రుడు వచ్చుదన్క దే
ల్వాడినిల్చు ఇరుల తీవను స్మరింపగజేతు;
వో మనస్సన్యాసినీ ఊర్మిళా !
ఓ ఆత్మ సంభాషిణీ ! నిర్మలా !

మునుముందు కదలిపోయెను దాశరథి అచ్చ
మౌ కర్మయోగి దివసాంత సూర్యునివోలె.

అతని వెన్నంటి సీతమ్మ; ఆతని బహిః
ప్రాణమ్ము ఛాయావిధాన నడయాడినది.

అనుసరించెను సంధ్యయై లక్ష్మణుండపుడు
తనయాత్మ నన్నిపాదముల క్రిందుగపరచి.

ఏ వొకర్తైవె నిల్చినావేల వెర్రి త
ల్లీ ! పంకమంచు తేలిన పద్మమునుబోలె.

తొలి జవ్వనపు మిసిమి పులకలారనిదాన;
వెపుడు నేర్చితివమ్మ ఇంత వైరాగ్యమ్ము.

నిసగాక మొన్న ఒల్లెను గట్టుకొనుదాన;
వెటుల తాల్చితివి తల్లీ! యింత నిగ్రహము.

కట్వాసుభవముల నాగటిచాళ్ల పడకముం
దే యింత శషము నీవెటుల పండించితివి.

## 12

ఒక చిన్న గాలిదెబ్బకు జలజలా కురియు
శ్రావణాంభోద సదృశమ్ము నీ హృదయమ్ము;

గండశిలగా మార్చగల్గినావా యేమి
కానిచో ఈ నిర్వికారమెట్టుల కల్గు ?

సీతమ్మకేమి మంచి అదృష్టవతి; ఆమె
కడవులైనను నందనారామములె కదా.

సౌమిత్రికా రఘుస్వామి సర్వ; మ్మతని
కేజన్మకైన బరువెత్తుకొనుటే ఫలము.

లోక కళ్యాణమునకై కాలకూటమ్ము
నీవు మ్రింగితివి కానీ చూపవద్దాని.

నీలోన ఎన్ని సుడిగాలుపులు రేగినను
ఒక పరంజ్యోతి పోలిక నిల్చినావమ్మ.

చిగురాకు బాకు దాల్చిన జోదునకుగూడ
నిను తేరిచూచు గుండెలు లేకపోయినవి.

నీ వభాగినివి; పున్నెముల పంటవు నీవె
నీవు యోగినివి; అంతేకాదు రాగిణివి.

నినుగూర్చి వ్రాయులేఖిని మషీరసములో
కాదు—కన్నీట మున్కలు వేయవలెనమ్మ.

## 13

సంస్కృతుల ఉపరి ప్రశంస లెందుకు నీకు
ప్రాకృతుల కాక దేవతాకృతిగ వెలసితివి.

ఓ మనస్సన్యాసినీ ఊర్మిళా
ఓ ఆత్మ సంభాషిణీ నిర్మలా.

21 మార్చి 1958



# అక్షరాంజలి

దాస్యగాఢాంధ్య పాటనోద్యద్దీపధ్వజుండు
వాఙ్మయాంభోధి తరణదీవ్యన్మేధాభుజుండు.
ఆతడాత్మ మనీషామహః ప్రీణితాన్యుండు
అత డన్యుండుకాడో అనన్యుండనన్యుండు.

అతడు ప్రతాపరెడ్డి;ఇరులై పడియున్న తెలుంగువారి గుం
డె తెరల దుల్పి వెల్గులను నిల్పిన మిత్రుడు;మూర్ఛ పోయిన
ట్టి తెలుగుజాతి సంస్కృతికి టీకలుదీసిన మల్లినాథు; డె
న్నితరములైన పాతవడనేరని సృష్టికి నాద్యుడాతడే.

అతని తల కైలాస శిఖరపు
టంచులను బింబించుకొన్నది
అతని మేధాలోకము జగత్
పితరుల ప్రతిష్ఠించుకొన్నది.

అతని వాఙ్మయ సృష్టికాతని
బ్రతుకు ఆమ్రేడితమ్మయ్యెను
అతడు సంసారమున నిల్చియు
అద్వితీయ మహర్షి యయ్యెను.

అతడు ముమ్మూర్తుల అహింసా
ప్రతినిధానము; ఐననాతని
కలము ముష్కరతా గిరీంద్ర
మ్ములకు వజ్రాయుధమ్మయ్యెను.

# 15

అతడు పల్కి_న పుల్ల విరిచిన
యటులతోచును స్థూలబుద్ధికి;
కాని ఆతని గుండెలోతున
కలవు సంజీవసులవెన్నో.

అతడు ముట్టినదెల్ల మృత్య
మ్మయ్యె భాషారంగమందున
అతడు పట్టినదెల్ల బంగరు
వయ్యె పరిషణ్మండలమ్మున.

అతని వైదిక జాతకమునకు
అచ్చిరానిది ఒకే యొక్క_టి;
అదియె ఊసరవెల్లిపాత్రకు
అనుగుణమ్మగు రాజకీయము.

జీవనదివలె గలగలా విక
సించిపారిన అతని ధిషణా
పటిమ ఊషరభూములందున
పసిడిపంటల వెలారించెను.

అక్షరార్చనలోన తన బ్రతు
కంత కపురముజేసి పోయిన
అతని స్మృతికేనేమి యిచ్చెద ?
అక్షరాంజలి యొక్క_టివినా.

22 ఆగస్టు 1957

# లోకాలోకము

ఆకసము బీజప్రదాతగ
అవనియే ఒక ఆద్యమాతగ
కాన గల్గిన మానవునకు జ
గజ్జనాళి ఒకే కుటుంబము.

నింగిలోపల లేవు ఎల్లలు
నీరధిని కనరావు ఎల్లలు
ఎందుకీ ధరణీ తలమ్మున
ఇరుకు వాడలు ఇనుపగోడలు.

అన్ని జాతుల కొాకే సూర్యుడు
అన్ని నేలల కొాకే చంద్రుడు
అయినచో జాత్యహంకారము
ఆటవిక తత్త్వమ్ముకాదా ?

ఏ కులము వెన్నెలది ? తెమ్మెర
లెట్టి జాతికి చెందినట్టివి ?
అట్టిదేకద మానవత్వము
అన్నిటికి ఎత్తైన సత్యము.

ఊహలే రెక్కలుగజేసి మ
హోన్నతముగా ఎగిసి చూచిన;
వసుధయంతయు కన్పడును పసి
వాడు విసిరిన బంతిపోలిక.

# 17

ఒక అహంత మనస్సులో వే
మారు తొల్తగ; దాని బాహిర
శాఖలే 'నాదేశ మిది నా
జాతియిది' యను భావరేఖలు.

ఆత్మ పాలసముద్ర మటు నిం
చార విచ్చిన చండి మనిషికి
విశ్వగోళము పండువెన్నెల
వెన్నులొరిగిన పంటపొలమగు.

మనసునంటిన అహంభావము
మంచుమాదిరి కరగిపోయిన
మనిషిలోపలి దేవతాత్వము
మణీముకురమువోలె భాసిలు.

స్నేహపవమానము అగస్త్య ఋ
షీంద్రు పోలిక సాగిపోయిన
నెత్తి బిగిసిన గిరులు సైతము
మెత్తబడి మును సాగిలంబడు.

మనుషులందరు అన్నదమ్ముల
మాదిరిగ జీవించగల్గిన
మర్త్యలోకమె దివ్యపదవికి
మారుపేరై పరిమళించును.

## 18

చంద్రమండల మందుకొన ధీ
శక్తులను వెచ్చించుకన్న
మానవుని దేవతగ మార్చెడు
మార్గమును కనుగొనుట మిన్న.

20 జనవరి 1958

—~~~—

# స్త్రీ అనగా శ్రీ

కేవల గంధర్వాంగనపై
గీతం గిలికే కాలం
ఏతాం తోడిన నీరులా
ఏనాడో పారిపోయింది.

మానవీ సుమనోంతరాళంలో
మధువులా ఊరిన గంధర్వాంశపై
పల్కులు నార్వోసే కాలం
తొల్కరి మబ్బులా వచ్చింది.

మత్తకాశినీ కబరీ
వృత్తం ఇతివృత్తం కాదిక..
ఆమె మనోమండలమే
అగు సత్యాన్వేషణ వేదిక.

కొండలూ కొండచిలువలూ
కూడితే యేర్పడునా స్త్రీ
అబ్బే! స్త్రీ అనగా శ్రీ
హరిహరులకు సంకేతం.

దైవానికి నామాంతరం మాయ
మాయకు రూపాంతరం జాయ.
ఆలిస్తే జాయ పాయసం
అదలిస్తే కాకోల విషం.

ఆవిడ చామముడిస్తే మరుడు
ప్రేవులు కదలి చస్తాడు.
ఆవిడ నవ్వితే అనంగుడు
ఆవులించి నిద్రలేస్తాడు.

ఆవిడ యెడద చేపితే లోకం
ఆర్నెల్ల పసిపాప
ఆవిడ ఔడుగరిస్తే లోకం
రావణాసురుని కాష్ఠం.

అంగనా బాహిరరూపం ప్రకృతి
అంతరంగం దానికి వికృతి
పురుషుడీ రెంటినీ కోరి
పొందుతాడు త్రిశంకునిగతి.

ఇంతిముఖం ఇందుబింబమని
ఎంతగా చమత్కరించినా
ఆమె అంతస్సులో పొంగే
అమృతపు సురుగైనా దొరకదు.

మగువ ముక్కు సంపెగ పువ్వని
మాట బొమ్మలెన్ని కట్టినా
ఆవిడ మనస్సులో విరిసే
తావిని పీల్చడం కష్టం.

స్త్రీ యెదలో పొన్నువేసికొని
హాయిగ నిద్రించే నరుడు
అమృతాంధసులందలేని
అద్వైతసిద్ధి పొందును.

చెలిమనస్సు కడలిసొచ్చి
చిరత్న రత్నాలు తెచ్చి
మాటల మాలలో చేర్చితే
మామూలువాడు మహాకవి.

17 ఫిబ్రవరి 1957



# ఒ క శ తా బ్ది

ఒక శతాబ్ది యదెంత లోపల
ఊహామాదిరి యెగిసిపోయెను.
ఒక మహాస్మృతి జీవనది పో
లికను జాతికి మిగిలిపోయెను.

బాహుకుని వలె కన్పడిన దౌ
ర్భాగ్యదష్టుడు భారతీయుడు
నలునిపోలిక ఒక్కమాటుగ
వెలిగిపోయిన గడియ నెంతును.

భరతజాతిని కాటువేసిన
పాము విలవిల దన్నుకొన్నది
విప్లవాధ్వర మంద్రవిక్షత
వీర్యమై మీరతున త్రొక్కగ.

ఝాన్సిలో ఒక అపర చండిక
నటలు విదలిచి హుంకరించగ
జాతినెత్తిననున్న దయ్యము
జారిపడి బెంబేలువడినది.

ఉడికె జ్వాలాముఖివలెన్ భర
తోర్వీగర్భము—అది పెఠిల్లన
కమిరిపోయెను అహితశక్తుల
కంటిరెప్పలు చీమలట్టుల.

అపుడె యీనిన వ్యాఘ్రిపోలిక
ఆగ్రహించిన వ్యగ్రజాతిని
పట్టుకొన నుంకించి యెవ్వడు
బట్టగట్టి సుఖించునయ్యా ?

ధర్మపుష్టమ్మైన జాతి స
దా కనుక్కొన రెచ్చిపోవదు.
అదియరేగిన సాదురేగిన
యటుల ప్రళయముగాకవచ్చును.

దాస్యమనునది నల్లమందు వి
ధాన సంఘమ్మును జడీభూ
తమ్ముజేసిన వేళలో నే
త్రమ్ము విప్పినవాడె వీరుడు.

దాస్యమనునది గాఢతమ ఆం
ధ్యమ్మువలె దేశమ్మును ప్రసు
ప్తమ్ముజేసిన వేళలో శం
ఖమ్ము నొత్తినవాడె వీరుడు.

అట్టి వీరుం డొక్కడేనియు
దట్టిగట్టిన చాలునయ్యా.
జాతినొసటగలట్టి వంకర
గీతలన్నియు చక్కగానగు.

వందయేడులక్రింద ఆర్యా
వర్తమందున బూదిగప్పిన
మిణుగురే దావాగ్నియై కా
ల్చినది పరతంత్రాటవీస్థలి.

ఒక మిణుంగురు ఝూన్సిలక్ష్మి
ప్రకటరూపమ్మును ధరించెను.
ఒక్క మిణుగురు వీరతాంతియ
ఉక్కుకత్తిగ అవతరించెను.

విప్లవాగ్నికి పత్రతామర
విరులె సంకేతమ్ములయ్యెను.
గొఱ్ఱెలటు కన్పడు సిపాయిలు
క్రుద్ధ కంఠీరవములైరి.

శీతనగమూలము మొదల్కొని
సేతుపర్యంతమ్ము నడిచెను
కోటి అగ్నిశిఖాళి—శాత్రవ
కోటి మోములు తెల్లవోవగ.

ఏండ్లతరబడి రాయియై
యుండిపోయిన ఋషులదేశము
నిటలనేత్రమువిప్పి సరిగా
నేటికొక్క శతాబ్దియైనది.

## 25

ఒక శతాబ్ది యదెంతలోపల
ఊహమాదిరి యెగిసిపోయెను
ఒక మహాస్మృతి జీవనది పో
లికను జాతికి మిగిలిపోయెను.

13 ఆగస్టు 1957

# సంస్కారధార

సుప్తాత్మనిలోన బాల
సూర్యుడు మేల్కాన్నయపుడు
మూర్ఛితునికి మరల ప్రాణ
ములు గానముచేసినపుడు;

చివ్వెలెత్తు ఒక మహాను
భవము, ఒక రసోత్తరవము,
కవినగు నాలోన నేడు
కనిపించెను, వినిపించెను.

ఈ యనుభూతికై, గీతికి—
ఏనాడో ఎడారియైన
ఎడద ఒకమ్మడిగ పాల
కడలియై కరళ్లుద్రొక్కె.

ఎన్ని యుగమ్ములు మాగిన
పున్నెపుటను భావమ్మది
ఎన్ని జన్మములు మ్రోగిన
హేలా మృదురావమ్మది.

దొరగిలిన మన్మానస
దుగ్ధసాగరోర్ములలో
గొంతులు సవరించుకొనె త్రి
కోటి కచ్ఛపులు మహాతులు.

కృష్ణవేణి తన చిరసం
కీర్ణ వేణి కేలబూని
అల్లుకొనుచు నన్నుగాంచి
ఆగిపోయె పుల్కరించి.

గోదావరి తన పురా ని
గూఢ గాధలను స్మరించి
తనలో తా నవ్వుకొనుచు
ననుగని లజ్జితయయ్యెను.

మంజీర నిజామల పద
గుంజన్మంజీరావళి
జీరాడగవచ్చి నన్ను
జేరి మోమువాల్చుకొనెను.

ధునీ విలాసినీ మణీ
గణము నా సమక్షమ్మున
నిలువగ అపర ప్రయాగ
మొలిచినట్టు లనిపించెను.

అంతట నాలోని సాగ
రాత్మ పొంగులెత్తి యెత్తి
నదీత్రయమ్మును గుండెల
కదుముకొనెను గాటమ్ముగ.

ఈ యపూర్వ ఘటనతోడ
ఎగిసి యెగిసి నా ఊహాలు
మిన్నందెను; నేనైతి స
మీచీన మహోరేఖగ
ప్రాచీనాంధ్రపతాకగ.

*　　　*　　　*

కవి వత్సలుడైన హాలు
గాథా సప్తశతి నైతి.
శాతకర్ణి భూతలేంద్ర
సమక్షమ్ములో జరిగిన
అగ్న్యాధేయాది మహా
యజ్ఞ హవిశ్శ్రేణినైతి.
అమరావతిలో గంధ
ర్వాంగనలకు వీణనైతి.

పల్లెపట్టులందు మరుగు
వడిన తెల్గు సరస్వతిని
రాచగద్దెపై నిల్పిన
రాజరాజ మూర్తినైతి.

తెల్గులకొాక దివ్య సంస్కృ
తిని భిక్షగ నందించిన
సనాతసుడు నన్నయ్య ప్ర
సన్న కథాగీతినైతి.

హరిహరులను ముద్దజేసి
ఆయువులనుబోసి జగతి
ప్రతిష్ఠించినట్టి కవి
బ్రహ్మ కావ్యరీతినైతి.

ఐతినంత రుద్రమ్మ క
రాంచల చంచత్ కృపాణ
చకిత ద్యుతిగా; కాప
య్యా కృతోద్ధత హుంకృతిగా.

అంతనైతి రెడ్డి రాట్స
మర్పిత కనకాంబరాఢ్యా
లంకృతుడగు శ్రీనాథుని
ప్రౌఢవద్య ఝుంకృతిగా
పోతన్న సుధాధారా
స్నాత భాగవత కృతిగా.

కత్తిగంటముల నొక్కటి
గా నడిపిన కృష్ణదేవ
రాయ 'భువన విజయ' భవన
రాజద్గోపురమైతిని.

మధురలోన, తంజాపురి
వదనములో, నర్తించిన

30

పలుకువెలది పైడి అంది
యల క్రేంకారమ్మునైతి.

అర్వాచీనాంధ్ర జగత్
సర్వతోముఖ ప్రతిభా
నిర్వచనము సేయు కవీ
జ్ఞికరవచోముకురమైతి.

నవాంధ్రావతరణావస
ర విభాతచ్ఛవినైతిని.
ఐతిసుమా ! నేనే 'నా
గార్జునసాగర'మైతిని.

5 అక్టోబరు 1956



# ఆత్మదర్శనం

అద్దంలో నా ముఖమగుపించలేదు—
శరత్సరోవరంలాంటి అద్దంలో—
సరస్సులో శయ్యపరచి గురకపెట్టు
శరదిందుని మనసులాంటి అద్దంలో—

నా ముఖమగుపించలేదు
నా చూపులు పాతవే
నా చూపులు విసురుతున్న
వీ చోపులు పాతవే.

నా చూపుల శిరోజాలు
నరసినవా? కాదుసుమా! లేతవే.
అయినా అద్దంలో ముఖ
మసలే అగుపించలేదు.

అద్దం అది ఆదర్శం
దృక్కులునే ప్రతిరోజూ
దులుపుతున్న వాక్కులు.
ఆదర్శానికి వాక్కుల
కన్యోన్యాలింగనానుబంధం
ఆకాశపుష్పగంధం—అంతేనా?



కుంకుమ కుసుమకిరీటా
లంకృత ధరణీదేవత

గర్భగుడిని ఉమ్మెత్తలు
గగుర్పొడుచుకొనివస్తే;
నిశ్శబ్దంగా కూర్చొని
నిరుటిపాట కెవడూహించని లిపిలో
మహాభాష్యమును వ్రాసే
నక్షత్రమహాయోగుల
నడినెత్తిని పిడుగులే కురిస్తే;
'కో'-యని ఆర్వంగలేని-
గుండెను గాండీవంగా కుస్తరించలేని-
పాటను ఈటెగా సాచి
ప్రయోగించలేని-నాకు
అద్దంలో ముఖమెట్లా అగుపించును ?
తూరుపు పడమరల నొక్క
దారమ్మున మల్లి మం
దారమ్ములవోలె కూర్చు
పురోహితుని కాళ్ళక్రింది
ముళ్ళముక్కలను చూస్తూ;
చలికారున మంచుతెరలు శాల్వాలుగా
వేసవి నగ్నికణమ్ములు కల్వాలుగా
సేవించిన సహనమూర్తి
నొసటిపైన రుద్దబడిన
మసిగుర్తులు గమనిస్తూ;
నిస్సంగతయను ముసుగున
నిర్వీర్యత దాచుకొన్న-

## 33

సమదర్శనమను పేరున
స్వార్థము పోషించుకొన్న—
నా కద్దంలో ముఖమె
ట్లా కనిపించును ?



కాలమొక యెడారై తే
ఖర్జూరముగా మారి
ఆశ యెండమావై తే
అందుననే జలమూరి;
బ్రతుకు బురదమడియైతే
పద్మంలా పైకిలేచి
గుండె ముళ్ళతీగై తే
గులాబిలా శిరమ్మోచి;
తను తానే తెలిసి; లోకమును తెలిసీ
మనుషులనూ వాళ్ళుండే
మట్టినిగూడా తెలిసీ;
అప్పుడుగానీ చూ స్తే—
అద్దంలోపల బహుశః
అగుపించును నా ముఖమ్ము
ఆదర్శానికి వాక్యాన
కానాడే పరిణయమ్ము.

15 ఫిబ్రవరి 1957

# చిగురు వల్వాలు

శైశిరవిష దిగ్ధవాయు
సంస్పర్శన మాత్రమ్మున
వణకిపోవు దరిద్ర తరు
వునకు నాకు భేదమేది ?

శిశిరుండను అసవాష్ణువు
వెచ్చెర రానున్నాడను
శీతలాత్ముడగు నెచ్చెలి
చెవిలోపల నూదిపోయె.

కలకలలాడెడు పచ్చని
వలువలుదాల్చిన తనువున
జీర్ణపర్ణవసనమ్ముల
జేర్చెడు దుర్గతి వచ్చెను.

శిశిరుడెంత దుర్మార్గుడొ
జీర్ణాంబరముల నైతము
ఊడ్చివేయునంతవరకు
ఊపిరులను తీయబోడు.

నావసనము లూడ్చివేయ
గా వచ్చిన ఫలమ్మేమి ?
ననులోకము ముందవమా
నము సేయగ హేతువేమి ?

## 35

పై వల్వలనూడ్చి నన్ను
పరాభవించిన మాత్రన
లోవలువలకేమి కొరత
లోవిలువలకేమి కొరత.

ఎన్నాళ్లీ విషశిశిరుని
ఏల్బడి కొనసాగుచుండు ?
ఎవడో ఒక తేనెమనిషి
ఏల అవతరించకుండు ?

అపుడే నాలోని చిగురు
టాకువల్వలను ధరింతు
అపుడే నాలోని ప్రసూ
నాలంకృతులను ధరింతు.

ఆనాడే నాలోపలి
అనంత సౌహార్దమధువు
నాకంఠము ద్రాగి లోక
మళియై ఝుంకృతినేయును.

ఆనాడే నా తనువున
ఆమ్ర కిసల విన్యాసం
ఆనాడే కోకిలాళి
కగును అక్షరాభ్యాసం.

2 మార్చి 1956

# విశ్వనాథ

(గుడివాడలో జరిగిన షష్టిపూర్తి మహోత్సవంలో చదువబడింది.)

తనరస ప్రౌఢకవి
తా జ్యోత్స్నికలతోడ
తామసాత్ముల పూర్ణి
మా మాలికలుదించె.

తన నిత్య యౌవనో
ల్బణ వచో వీచితో
ఆకురాలిన గుండి
యలపూలు తొడిగించె.

విశ్వనాథ కులాబ్ధి విధుడు ఆంధ్ర సా
రస్వతోద్యానవన మధుడు.

అతనికీనాడు ష
ష్ట్యబ్దాలు నిండెనట
అతని తల వెండిమల
యై వెల్గుచుండె నిట.

అతడు మేధను కపుర
మటుల వెల్గించి సా
హితిని నటనమ్ములా
డించె తన కట్టెదుట.

అట్టి కవిలోక స
మ్రాట్టునకు కాన్కవె
ట్టెద నాయెడదతోట
నెదిగిపూచిన పాట.

*　　*　　*

నీవు ధిషణాహంక్రి
యావచః పతివంట
నీవు దూర్వాసక్రు
ధావిష్టమతివంట.

అగుగాక; నన్నయ
యన్నట్లుల నీ నిండు
మనము నవనీత సదృశమ్ము పల్కుదా
రుణ వజ్రధారాసమమ్ము.

విశ్వేశ్వరుని మ్రోల
వేయిపడగలనెత్తి
విజ్ఞానరత్న దీ
ప్తిచ్ఛటల్ సాచితివి.

బ్రహ్మాండమును ముంచు
ప్రాగితర నాగరక
తాంభోధినాప చెలి
యలికట్ట వేసితివి.

భావని శ్రేణికల
పై దివికిసాగి రా
మాయణ సురద్రుమము
మా తోటనాటితివి.

నీ బహుముఖ ప్రజ్ఞలోన షడృతువులు
నిలిచినవి ఏక కాలాన.

గోదావరమ్మయా
కాదు; కృష్ణమ్మయా
కాదు; పెన్నమ్మయా
కాదు; తుంగమకాదు.

వాదులాటలురాని
సాదుకిన్నెర యామె.
సాదుకిన్నెరయామె
జాలికన్నియ యామె.

జాలు కన్నెను జూచి
జాలిగుండియ పూచి
శోకించినాడ 'వో
హో కిన్నెరా' యంచు
నీ శోకమే శ్లోక
మై శిలల్ కరగించు.
ఎవ్వడా రాయైన
జవ్వనుడు? ఎవ్వరా

జువ్వమని నీరైన
జవ్వనుల తలబంతి ?
నీ యెడద మెత్తదన
మే యటుల రూపించె.
నీ కల్పనాలోక
మే కిన్నెరను గాంచె.
ఎన్నిమారులు తెల్గు
లేగి చూడగలేదు
కిన్నెరను; అది వారి
కిన్నదిగ కన్పించె.
ఓ కవిబ్రహ్మ ! నీ
లో కనులమున్ముందు
ఒక సన్నవాగు నా
యిక వోలె భాసించె.
తన పతిని వెదకు విర
హిణివోలె కన్పించె.

పడతి కిన్నెరసాని
* తడలలో; ఆమె క్రొ
న్నడలలో; ఆమె ని
ల్కడలలో, సుడులలో
కడలేని సుంత తడ
బడచోని నీకైత

* తడలు = కెరటాలు (తెలంగాణా మాండలికమిది)

## 40

నడచెడంగులె కానుపించు మా తెను
పెడదలను యాలలూగించు.
అతివ కిన్నెరసాని
శ్రుతిలోన, ఆమె ఝం
కృతిలోన, ఆమె మధు
రతిలోన, గతిలోన
అతిమసృణమైన నీ
అమృత హృదయములోని
సంగీతమే చెంగలించు స్వర్ణ దీ
రంగత్త రంగాలమించు.

నెలత కిన్నెరసాని
నిట్టూర్పులను దించ
అబల కిన్నెరసాని
హా యంచు దుఃఖించ;
చాన కిన్నెరసాని
ప్రాణాల పెకలించు
ఏడ్పునకు దిగులుపడి
గాడ్పులే రోదించ;
నీ మిసిమి మనసు కన్పించు జాలి పె
న్నెల గుండెలందు వర్షించు.

15 జనవరి 1956

---

# మనోమథనం

(ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందు ఒక దేశభక్తుని స్వగతం)

అహంతాతిరేకమ్మున
అంకస్థిత పేటీ సదృ
గమృత పాత్ర కోలుపోయి
ఆందోళన పడుచుంటిని.

సాటివారి సాయముతో
సముద్రమథనము చేసితి
అడుగడుగున కమృతభాండ
మాశాప్రేరణ సేయగ.

అయ్యయ్యో ! ఇది యేమిటి
హాలహాల మహోజ్వాల.
పుండువడిన పాదమగ్ని
కుండమ్మున పడినలీల.

నా దురహంకృతిచే సం
ద్రము పాలైనట్టి అమృత;
మైక్య మహోద్యమమున సా
ధ్యమ్మని ఆశించినాడ.

పదిమందిని ఒక్కత్రాటి
పైనజేర్చి, నిష్పాటిత
మందరమును మంథన సా
మగ్రిలోన జేర్చినాడ.

దైత్యుల సైతము నాఉ
ద్యమ కర్తలలో గణించి
సర్వేంద్రుని చుంచుదువ్వి
సహకారము పొందినాడ.

ఇంత సహన భావముతో
ఇంత శాంత మనస్సుతో
కృషిచేసిన సాధకునికి
విషజ్వాలమా ఫలితం ?

అమృతసిద్ధి కాలేదని
ఆందోళన మొందుదునా ?
హాలహాల రోధనమున
కాక్రందన సేయుదునా ?

ఎవడో ఒక భూతేశుడు
అవతారము కట్టనిచో
హాలహాల మణగిపోదు
అమృతము పై కుబికి రాదు.

మా సంఘములోనే ఒక
మహేశ్వరుని పైకిదీసి
హాలహాల భక్షణ కా
ర్యసంపూర్తి కావించెద.

## 43

నడుమ పుట్టినట్టి విషము
నడచివేసిన పిమ్మట
అమృతోద్గమ మేలకాదో
ఆ సంగతి కనుగొందును.

24 ఫిబ్రవరి 1956



# సూర్యుడు

కవితా లోకమున్నసైన
కాస్తనేపు 'భూగోళం'
మాటవిస్మరించి సూర్య
మండలమును చూడుడు.

గుండెపైన ఆశయనే
కుంపటితో పగలంతా
ప్రయాణించి చెమటోడ్చని
బాటసారి సూర్యుడు.

తాను పడినశ్రమకు ధరణి
తగిన ఫలితమివ్వకున్న
ఒకనాటికి సమ్మెచేయ
ని కూలీడు సూర్యుడు.

19 నవంబరు 1955

# యజ్ఞఫలం

(ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో వ్రాసినది)

గగనమ్ముపై బిర్రబిగిసి కూర్చున్న గం
గను నేలపైకి దించిన భగీరథునివలె;

ప్రతి తెల్గువాడు శిఖరితమస్తకముతోడ
కన్పదెను సర్వాంధ్ర కల్పద్రుమము నీడ.

తలజడల్గట్టగా అలనాడు సగరు ము
న్మనుమండు నిర్వహించెను దుర్భరతపమ్ము.

బ్రతుకునే ఇంధనప్రతిజేసి మా తెల్గు
వాడు సాధించె నీనాడు యజ్ఞఫలమ్ము.

ఇది మనకదృష్టమ్ము ఇది సుధాశ్లిష్టమ్ము
దివ్యాత్మకులకే సంసేవ్యమానము సుమ్ము.

తెల్గునదులందు గుండెలు మున్గ స్నానమ్ము
లొనరించి సాగిరండో శుభ్రమతులార!

అమృతమున కామ్రేడితమ్మునైన ఈ యజ్ఞ
ఫలమారగింప బంతులు దీర్చి కూర్చొనుడు.

ఎవరి భాగము వారు ఇవతళించిన చిత్త
ములతోడ స్వీకరింపుడు సుమ్ము విబుధులై.

మీ బంతిలోనే సుమీ పొంచెదరు వేలు
పుల పూతలో విషాత్ములు రాహుకేతువులు;

చిరతప స్సంప్రాప్త జీవఫలమున రేణు
వంత వారికిదక్కెనా ప్రళయమైపోవు.

దివిజులెవ్వారొ ? రాహువులెవ్వరో ముందె
దీనికషముల పైన తేల్చుకొనుడీ మీరు.

అనుభూతఫలులు అమృతాత్మకులు తెల్లులపు
డొక్కొకడు రవణిల్లు రుక్కువలె ఋక్కువలె,

ఋరులు కిన్నరులుగా గిరులు మేరువులుగా
అడవి చెట్లన్ని కల్పానోకహములుగా;

మనసమీకృత విశాల నవాంధ్రదేశమ్మె
విలసిల్లు నవమానవుల స్వర్గసీమగా.

నవంబరు 1956



# దివ్యమానవుడు

నేను దానవుని సైతము
నిర్జించిన మానవుడను
కాని మానవుని జయించ
లేని లోని మానవుడను.
వెదురు బొంగులో దాగిన
మృదురసార్త్తనాదమువలె
హంసముక్కులో నక్కిన
అతిలోక వివేచనవలె;
మానవపదవాచ్యుని ఎద
మలకలలో మరుగువడిన
అజ్ఞేయుడనేను వివే
కజ్ఞేయుడనేను సుమా!

ఒకని నీడజూచి మరొక
డుల్కిపడిన విషమవేళ
ఒక్క గొంతుపై మరొక్క
ఉక్కుచేయి మసలువేళ
చూడలేక నోరురాక
స్రుక్కువడిన మానవుడను
చిత్రమైన వ్యూహములో
చిక్కువడిన మానవుడను.

అసహిష్ణుత ఝంఝానిల
మై విరుచుక పడినప్పుడు

పశుతత్వం ఉదుతమన్న
వృశమై ముసిరినయప్పుడు:
ఆలంబనరహితమైన
ఆత్మవోలె నిల్చియుంటి
ఏ స్నేహబలమ్మెననో
ఇంతదాక వెల్గుచుంటి.

నా కీ_ర్తిని రాకాచం
ద్రజ్యోత్స్నల బంతిలోన
పరి గద్దియ నిల్పెడు కాం
క్ష లేశము లేదు నాకు.
ఆశించను గగనధునీ
హైమాంభోజము లెన్నడు
మట్టిలో విరబూచిన
మల్లియ లిష్టములు నాకు
నాచుట్టు భ్రమించెడు అం
ధలోకమును వెల్గించగ
బ్రతుకును కర్పూరమువలె అ
ర్పణ సేయుట ప్రియము నాకు.

నేను కోరుచున్నది కుం
దేటి కొమ్మగాదు; ప్రకృతి
యందు ప్రతిపదమ్మునందు
ముందునిల్చు పదార్థమ్మె.

అది అమృతాంధసులైనను
ఆసాదించని ఊహాము
తన్నెరిగిన ప్రతి వానికి
పెన్నిధానమది స్నేహము.

ఆ స్నేహమనోజ్ఞభావ
నా స్వప్నపితులలోన నేను
పాలకడలిలో వెన్నని
ఏల లీలగానుందును.

సురభిళ శబ్దమొక్కటి
తరగెత్తిన చాలు, నాయె
డంద సందులందు కోటి
నందనాలు గుబాళించు.

ఒక చాంద్రీమయ దృఙ్మా
లిక ప్రసృతమ్మైన చాలు:
నా మనస్సులో పుల్కలు
నారువోసినట్టులౌను.

ఇరు గుండియలొక సూత్రపు
విరుత్తై కలిసిన చాలును;
పొంగి నింగినందుకొందు
పాదపమ్ము లతికినట్లు.

స్ఫటిక స్వచ్ఛములుగ ఆ
భాసించిన అంతరంగ
ములలో నెత్తురు చారలు
మిలమిలమని కదలాడగ;

తన గుండెను చీల్చి దేవ
తల కమృతము పంచిపెట్టు
చంద్రునివంటి మహాత్ములు
క్షయగ్రస్తు లగుచుండగ;

నాలోపల నేదో మం
దరగిరి అట్టిట్టు కదలి
నట్టులౌను; కాలకూట
ముట్టిపడినయట్టులౌను.

పువు రేకులలో పర్వత·
మూలమ్ముల పెకలించెడు
వజ్రేయ మహా సంక
ల్పమ్ము నాందిపల్కు నాడు;

దీన జగద్రుధిరకణో
ద్దీప్త మనోవర్తులు చ
ల్లని స్నేహ స్పర్శన మా
త్రమున వెల్గిపోవునాడు;

పాపము పోలిక గుట్టలు
గా పుట్టలుగా పెరిగిన
జిఘాంస నేలమట్టమై
జిజీవిష చివుర్చునాడు:

నాపై కన్పడు మానవ
రూపము సార్థకమ్మగును
నా సంజ్వరితాత్మకమృత
కాసార స్నానమగును.

నేను దానవుని సైతము
నిర్జించిన మానవుడను.
కాని మానవుని జయించ
లేని లోని మానవుడను.

[illegible] 1956

---

# జన్మదినము

నేను జన్మించి ఒక లిప్తయేనికాదు
అప్పుడే అబ్దములు ఇర్వదైదు రెక్క-
లార్చి, గొంతెత్తియార్చి, కాలాబ్ధిలోన
రాలిపడెనందురదియె చిత్రమ్ము నాకు.

మీ కనులకేను కన్పింతు మిసిమి చిందు
పాతికేడుల బంగారు ప్రాయమందు;
కాని నమ్ముడు చీకటి కడుపు జీల్చి
బయటపడినట్టి వెల్తురు పాపనేను.

ఎడదను గానుగాడినటులే యనిపించగ, ఎందువిన్న సాం
ఖ్యడమరుపాళి అట్టహాసితమ్మొనరించగ, బిట్టు సంకటం
పడియుడిసట్టికేకలకు భాష్యము సెప్పుచు, గాలిప్రోగులౌ
నుడులకు కావ్యతాగరిమ నూల్కొనజేసితిరా విముగ్ధులై.

అంధతమ సొంగనా జటాబంధమంద
మంద విస్మృమర ఖద్యోత మల్లికాధ్వ
ములను జీవన ఘంటాధ్వములుగ నెంచి
వేల్పాడితి రెండు గతవయోవేళలందు.

ఏదో వెల్గు కరశిల్ప త్రొక్కినటులై ఏదో మహాసౌరభే
యీ దుగ్ధమ్ము నురుంగులెత్తినటులై హృత్సీమ పొంగార నా
యీ దేహమ్మతి కుంచితమ్మయి మనస్సేమో సుధాభ్యంచిత
మ్మై దివ్యత్వమ్మునందనిల్చితినిగాదా లోకమందీగతిన్.

పడచిన వత్సరమ్ములు ఒకండొకదే మసింటాలువాల్చిక
న్పడినవి నా యెడందతెరపై; జడివానలు హైమధూమముల్
పొడిపొడిగా ముసుగుల్ నడచిపోయినవాపయి; ఎంతయైన క
న్పడపుగదా సుధారసమునన్ శుచియైన వసంతరాగముల్.

విపంచికలను మేసి ఒగరువారిన గొంతు
కలను గాంధర్వశాలలుగ నెంచి
త్రుటిలోన సాగి యంతటి త్రుటితమ్మగు
మెరుపులలో మేని విరుపులెంచి
పవనాహతికి చీరుపడిన మబ్బులలోన
ప్రస్తరశిఖరచ్ఛాయ లెంచి
రప్వంత మాఘసౌరభము వీచిన పూల
పూర్ణ సుధాభాండములుగ నెంచి

ఎపుడొ సంకేతముల మట్టిదివియలంటు
మెలికపడు వెల్తురుల గాలిమెట్ల నెక్కి
అప్పుడే ఏదొ హైమ శైలాగ్రసీమ
నంగహొప్పృష్టి యూహించినాడ నాడు.

15 జూలై 1956

# విశ్వదాత

ఓ విశ్వదాత ఓహో యశఃస్నాత నీ
అమృత స్మృతికి అక్షరాంజలి నివేదింతు.

వినగాక మొన్న మొల్చిన నేను నీ చిరం
తన కీర్తినే వృత్తమున గాన మొనరింతు.

నేడు హసియించి మర్నాడు వాడెడు మల్లె
పూలు నీ శాశ్వత యశోలాంఛనములౌన ?

కాల్జారిపడినట్టి గగన ఝరి నీ మహో
న్నతకీర్తిమూర్తికే గతిని ఉపమానమగు ?

గాలితాకిడికి గగ్గోలుపడు తెలిమబ్బు
తున్క నీ స్థిరకీర్తితో నెటుల తులదూగు ?

ఒకమారు నీ కళాత్మక ముఖము కన్పింప
కలుష హృదయమ్మైన కలశాబ్ధియైపోవు.

ఒకమారు ధ్యానముద్రిక నున్న నిన్నెన్న
లఘుచిత్తమైన కైలాసగిరియైపోవు.

కలుషిత జగత్తులో కాలూని ఆత్మను శ్రీ
వాంకితము చేసితివి; పంకాన పద్మమటు.

నీవు మణిముకురమవు నీలోన మా తెన్గు
సాహితికి ఆత్మదర్శనము కల్గినదయ్య.

నీ యెముకలేనట్టి చేయి ఎందరో సర
స్వతుల దరిజేర్చి శ్రీయుతుల జేసినదయ్య.

ప్రాపంచిక విభూతితోపాటు సచ్చిదా
నందానుభూతి పెంపొందజేసిన మునివి.

కేవల దారుణ శిరోవేదనయె కాదు
మానసికరోగములు మాపిన భిషజ్మణివి.

ఒకవంక నిగమ సమ్ముఖుడవై వేర్వంక
ఉప్పు సత్యాగ్రహపుటుద్యమము నడిపితివి.

సతత లింగార్చనా సంతృప్తుడవె కాక
నరుడె పరమేశుడని హరిజనుల చేరితివి.

ఎటనుంటివో నేడు? ఎటనుందువా శివా
నందలహరీఖేలన మరాళ రాజమవు.

ఏమింటుచో నేడు? ఏమందు వోంకార
మంజుల క్రేంకారమయ మయూరమవీవు--

9 ఏప్రిల్ 1957

- ⁂ -

# ఆగస్టు వెలుగు

పసుపు ముద్ద వజ్రమ్మై,
హింసిపోని సంకల్ప
ముద్ద పాశుపతాస్త్రమ్మై
చికిలివారు శస్త్రమ్మై
శిలీభూతమలినాత్మల
శేషిత రక్షః ప్రకృతుల
పిండిపిండి గొట్టినట్టి
పెనుమంటల నెట్టినట్టి
శుభదినానుభూతి మరల
సురభిళించె గుండె తెరల.

గత వర్షానవకమ్మై
గతియే నాలోన నొక్క
చలచల్లని అమృత పరీ
మళల హారిక వీచిపోయె.
ప్రతిపర్యాయం నాలో
శతచైత్ర రథాలు విరిసె
స్వేచ్ఛా పక్షాల నెత్తి
చిత్రమగు రథాలు నడిచె.
గుండె పొంగులిడి హిమాద్రి
కొసనెత్తమ్మును స్పృశించె.
ఆపై సాకృత తేజో
రూపము సాక్షాత్కరించె.

దాస్యమనే నల్లమందు
తరతరాలనుండి మ్రింగి
స్పృహదప్పిన మా జాతిని
ముహూర్జాగరితముచేసి:

పారతంత్ర్య భావరజః
పటల పరిచ్ఛన్నులైన
మాదృశులను లేవదీసి
మానవతను నూరిపోసి:

చల్లగ నా తేజము హిమ
శైలమ్మున లీనమాయె.
ఆ తేజమె మానవు లె
ల్లరకు సేవ్యమానమయ్యె.

ప్రతివత్సరమున ఆగస్టు
పర్వదినమ్మున వెలుగే
గుండె గుండెకొక దీపాం
కురమునుంచి మాయమౌను.

మరలనదే తేజము నీ
పరిమాయము దరిసించితి
దాని యడుగులందీ గీ
తమును కొన్కగా నుంచితి.

30 జులై 1956

# కదలేని కడలి

ఏమిపల్కుదును నా
దేపాటిగొంతు ని
స్తంద్రమ్ముగా మ్రోగు
సంద్రమ్ము ముందు.

ఒకరెండుమార్లు గొం
తుక నెత్తితినో లేదో
విమల గాంధర్వమ్ము
వీగిపోయిన దనిరి.

ఒక రెండుతీర్ల గి
తిక లొత్తితినో లేదా
వాగ్దేవతకు మోము
వాలి పోయిన దనిరి.

విశ్వమానవుల ని
ర్వేదవేదధ్వనుల
వినిపించు రత్నాక
రుని ముందు నేనెంత ?

బడబాగ్నులను గుండె
యొడిలోన ముడుచుకొని
జలచామరముల వి
శ్వంభరను లాలించు.

శివమెత్తికొనుచు వ
చ్చెదు వేదనోర్మికల
నొక మహాయోగి పో
లిక నిగ్రహము సేయు.

కడలి కెదురుగ నిలం
బడినపుడు నేను వె
ల్వెలనోదును ప్రభాత
వేళ దివ్యయలీల.

తన తనువునుప్పు నీ
టను నిల్పి లోకాల
కలనాడె అమృతాంశు
నర్పించినది కడలి.

బీజాత్మకమైన
పృథ్వి సాహస్రదళ
పద్మమగుటకు కడలి
ప్రత్యక్షమగు సాక్షి.

కడలి తరగల యౌగి
కముగ నాలోకింప
కనిపించు లిపికండ
గాలేని కావ్యాలు.

## 60

కడలి తరగలలోన
ఎడదల ప్రతిష్ఠించ
వినిపించు మహతి కం
దని దివ్యనాదాలు.

డిసెంబరు 1956



# ఇది హైదరాబాదు

(ఆంధ్రప్రదేశ్ అవతరణదినంనాడు వ్రాసిన 'గైడు' గీతం)

ఇదిహైదరాబాదు ఇదిహైదరాబాదు
ఇది భిన్నసంస్కృతులు ఎదిగి పూచినపాదు.

ఇచట మల్కిభరాము ప్రచురితమ్మొనరించె
తెలుగు భారతిశింజినుల మంజులస్వనము.

ఇచట గోపన్న చేయించె తన బ్రతుకు వె
చ్చించి సీతమ్మకొక 'చింతాకు పతకమ్ము'.

ఇచట తెల్గులవాణి ఇచట ఉర్దూబాణి
కలసిపోయినవి ముక్తా ప్రవాళములట్లు.

రావోయి తమ్ముడా రమ్మురాయలసీమ
నుండి సాగరసీమ నుండి నెల్లూరి నుండి.

పొగబండి దిగ్గి సూటిగ పొమ్ము సంభ్రమా
త్మకము సాలార్జంగుని కళానికేతనము.

ఒడలి వంపులదెల్పు తడిచీరెతో నిల్చు
పడతి కన్పడ సిగ్గుపడబోకు చిత్రమది.

తెలిమేలి ముసుగులోపల మెత్తగా నవ్వు
జవ్వనిన్గని చేయిసాచకుము శిల్పమది.

ఒక కొన్నిదినములుత్సుకత పొంపిరిపోవ
దర్శించుమా కళాదర్శ నిలయాంతరము.

అప్పుడు కనవయ్య జలదాంగనలతో సరా
గములాడు చార్మినారు మనోజ్ఞశృంగముల.

అటనుండి విశ్వవిద్యాలయమ్మున కేగ
పోయి అది ఇంద్రసభ నుండి రాలినతున్క.

ఇస్లాము సంస్కృతిని హిందూమతాత్మనొక
అద్దానజూపు హర్మ్యశ్రేణులను గాంచి:

ఘంటాపథమ్ములను గడచి విశ్రాంతికై
సాగిపొమ్ము హుసేను సాగరతటమ్ముపై.

అచటనొక గడియనేపైన కూర్చొని తాన
మాడుము సమీరనీతాంబుశీకరములన్.

హైదరాబాదింక నీదే సుమా! నీవు
వలసవచ్చినవాడ వనుకోకు కలనైన.

సహనమే నీకు భూషణము; దానిని దాల్చ
తెలగాణ నిన్ను గుండెల కద్దుకొనునయ్య.

బాసలో నొకకొంత యాసవిన్పడుగాక
వేసాననొకకొంత వింతకన్పడుగాక.

అయిననేమాయెనయ్యా తెల్గులందరికి
సంస్కృతియొకండె పూసలలోని దారమటు.

14 నవంబరు 19

# నీవు పిల్చితివి

నీవు పిల్చితివి మరింత
నిశ్శబ్దమ్మలమికొనగ.

నా యెడంద అంజనాద్రి
యై, అంధతమస గుహయై
కాలోరగవిషసమ్మూ
ర్ఛాలసమైయున్న వేళ;
నీవు పిల్చితివి మరింత
నిశ్శబ్దమ్మలమికొనగ.

నీ పిలుపున తేనియ వీ
ణియలు మూల్గునను కొంటిని.
నీ పిలుపున పికీగళ
వ్యాపృతి గలదను కొంటిని.
ఎలనాగల కన్నుల దా
రులలో మెత్తగ నడచెడు
కలలకాళ్ళ సవ్వడినీ
పిలుపున గలదను కొంటిని.
కాని నీవు పిలిచితివిం
కా నిశ్శబ్దత పేరగ.

మ్రోసి మ్రోసి పారవశ్య
మును పట్టగలేక తెగిన
నట స్వామి దక్షిణ చర

ణ నూపురమ్మైనగాను.
పలికి పలికి తారాధ్వ
ప్రసారితస్వరమై మది
చెదరి మూర్ఛపడిన విపం
చీ తంత్రికనైనగాను.
ఇపుడిపుడే మ్రోయుదునని
ఎడదను కిన్నెరగ మలచి
స్వరనిర్ణయశంకా ని
స్తబ్ధ జీవనుడనైతిని.
గుండెనిండ శబ్దబ్ర
హ్మాండమ్మును నింపుకొనక
ముందుగనే నీ రవతా
ముద్రితాత్మకుడనైతిని.

మరల నీవు పిలువుము హిమ
గిరి వీపు చురుక్కుమనగ
తురగలించు తరుణసూర్య
కిరణ కశాగ్రమ్మువోలె.
మరల మరల పిలువుము ఉ
న్మత్తాంభోదద్వీప మ
స్తముల నెచ్చరించు విద్యు
దంకుశాగ్రధారవోలె.

65

మరల నీవు పిలిచిన పి
మ్మట చూడుము నా యెడంద
ఏకకాలమున డమరుక
మ్మై కచ్ఛపియై మ్రోగును.

5 జూన్ 1956



# సురభిళాత్మ

ఇవి నా యెదలో చుక్కల
పువ్వుల పరిమళమ్ములా? నభోంగణవిచల
న్నవ శంపాతరుణీ గా
త్రవల్లికా సౌరభమ్ములా? పొరలాడెన్,

ఈ సౌరభ సమీర మా
లా సర్వణమున హృదంతరజ్వాలనశిఖల్
భాసిలె వెన్నెల వత్తులు
గా, సుమకోమల దళాలుగా, చిత్రముగా.

నా గుండెబడగలవలె చెల
రేగెడు మాత్సర్యధూమరేఖల నేవో
రాగామృత భావమ్ములు
తీగెలుగా సాగిపోవ తీరులుదోచెన్.

కనులముందు పర్చిన అంధకార సాంద్ర
యవనికలు క్రమక్రమముగా నవిసిపోవ
కనబడెను వెల్గురవ్వల చినుకు మిణుకు
మిణుకుమనియెడు జ్యోతిరింగణగణమ్ము.

ఎదను ద్వేషము తెరచాపలెత్తినపుడు
ఎదుట చీకటిదప్పు కన్పించదొండు
ఎదను స్నేహము సురభియై కదలినపుడు
ఎదుట వెన్నెల మొల్కలే యెదుగుచుండు.

# 67

పండుటాకులురాలు శబ్దములు విన్న
నా మనశ్శ్రవణమ్ముల కీనాడు శ్వేత
మల్లియల వెండియందెలు ఘల్లురనిన
పదములల్ల నల్లన వినంబడుచునుండె.

నన్ను లోలోపల దహించుచున్న ద్వేష
వహ్ని నమృతీకరించిన పరిమళములె
పదములై రసాస్వదములై చిదికినట్టి
నా మనోంగణమును నందనముగ మలచె.

ఎన్ని ఋతువులు గడిచె నా కన్నులెదుట
మబ్బులవలె, వెన్నెలవలె, మంచులవలె,
ఎన్నడైన నేటివలె నా యెడద సురభి
ళించెనా? నందనము మోమువంచు కొనగ.

ఈ సురభిళాత్మతకు నేది హేతువగునొ?
ఈ మసృణ రాగమున కేది హేతువగునొ?
ఐన నౌను వాసంతరమానిబద్ధ
చారుఘుసృణ చేలాంచల చాలనమ్ము.

పుడమిని పరిమళప్లుతముగనొనర్చు
విరులకాపులరాక లబ్బురముగాదు.
ఎడదను పరిమళాల ముంచెత్తునట్టి
పూలనెల పుల్కరింత యపూర్వమౌను.

20 ఫిబ్రవరి 1956

# చంద్రముఖి

అలరులను తలిరులను
వలువలుగ మలచుకొని
పూర్ణేందు బింబమును
మొగమందు ముడుచుకొని;
అచ్చరలు రిచ్చపడ
వచ్చి నిల్చినదొక్క-
మచ్చెకంటి మదీయ
మానసాంగణమందు.
ఎవరవమ్మా నీవు?
ఏమేమి? 'దుర్ముఖి' వ?
ఇదియేటి పేరు నే
నేనాడు వినలేదు.
నినమొన్న 'మన్మథు' వి
గనినలోకముకనుల
కీవు దుర్ముఖివిగా
నే కన్పడితి వేమొ?
ఎవరేమియన్న నీ
వవతరించిన వేళ
అమృతోపమానమ్ము
అక్షరాల నిజమ్ము.
అబ్ధాలనుండి మే
మమృత సంప్రాప్తికై
అబ్ధిమథనము సేయ
హాలాహలమ్మొదవె.

69

హాలాహలము మ్రింగు
అభయుండు అభవుండు
అవసరములేకయే
అది యమృతమైపోయె.
అమృతోదయమ్మగుట
అంతకష్టముగాదు
అద్దాని అనుభవ
మ్మతి జటాల సమస్య.
తగిన వారికి సుధా
దానమ్ము నేయగల
అపరమోహినివట్లు
అవతరించితి వీవు.
రక్కసులు నీ మొగము
బిక్క బిక్కన జూడ
దివ్యాత్మకులకు అం
దించుమీ అమృతమ్ము.
అమృతమందగలేక
కుమిలిపడు దానవులు
నిన్ను దుర్ముఖియంచు
నిందించెదరుగాక.
అమృతప్రపానయో
గ్యతగల్గు దేవతలు
చంద్రముఖియని నిన్ను
సంస్తుతింతురు గాక.

9 మార్చి 1956

# ఆశలు

ఆశలు మరాళ గరుదంచలములై
అవనిపై జారినట్టి శప్తాప్సరల
అలసిపోవని కటాక్షాంచలములై
నన్నెగురవేసె వెంటనె క్రిందబడద్రోసె.

*　　*　　*

పొడమెనొక వింత అనుభూతి; నాతనువెల్ల
ఎడదగా రూపొందు రీతి.
కడకొక్క పువ్వునై నగాకయే నను నేనె
విడిపోయి పరిమళమ్మునైతి.

దెసల నాసికలందు ప్రసరింతునా లేక
దివిగుండెలోన గొండిలిసేతునా ?
కసిదీర అప్సరో గజగామినుల యెదల
మసలి ఉన్మాదాగ్ని మండింతునా ?

అదలింపబడితినే నాశాసువర్ణశై
లారోహణము సేయునపుడు.
ఈ హోపరాఙ్ముఖుడ ఊహాంగనా సఖుడ
నేమందురో చూతునిపుడు.

తొలిమబ్బురాచకన్నెల కొప్పులూపి రా
ల్తును చుక్కలనెడు మల్లెలను.
మెఱుపు దొరసానులను వెరపింతు దోతునని
మేని జల్తారుటొల్లెలను.

# 71

పారిజాతాంగనల పట్టితెచ్చి పలాశ
పేదలకు పెండ్లిసేయింతు.
నెలయేటి సొగసు కత్తెలు మేరుగిరి పతికి
గిలిగింత లిడ సంతసింతు.

* * *

ఆశలను దిగద్రావినట్టి వాడే తావి
యంత స్వేచ్ఛగ ఎగసిపోవు.
బ్రతుకును పరిమళప్రతిగా మలచుకొన్న
వానికే పరిధులును లేవు.

3 ఆగస్టు 19[illegible]

# జ్వాలాముఖి

(ఇటీవల ఇరాకులో జరిగిన విప్లవంగురించి)

జనహృదయం నిద్రించే
జ్వాలాముఖి.
జనహృదయం జడధిలోని
బడబాశిఖి.

ఒక్కమాటు జ్వాలాముఖి
ఒళ్లువిరిచి దూకిందా?
ఆగవు ఖిల్లాగోడలు
ఆగవు బంగరుమేడలు.

ఒక్కమాటు సుప్తజడధి
రెక్కలు జాడించిందా?
ఆగవు చెలియలి కట్టలు
ఆగవు చెట్టులు గుట్టలు.

జగతిపైన జ్వాలాముఖి
జడధిలోన బడబాశిఖి.
ఎక్కడదఉంటే యేమిటి?
ఒక్కగొంతుకే రెంటికి.

చైతన్యం జ్వాలాముఖి
జాతివాచకములందును,
సౌజన్యం బడబాశిఖి
సమానార్ధకములందును.

జనహృదయం కనుక్కొనే
సరళరీతి ఇదో చూడు.
చైతన్యం సౌజన్యం
సంకలనంచేసి కూడు.

చైతన్యం సౌజన్యం
సౌజన్యం చైతన్యం
రెండు కలిపితే నిల్చే
దండిశక్తి జనహృదయం.

జనహృదయంతో ఎప్పుడు
సయ్యాటలు పనికిరావు.
జ్వాలాముఖి ఏ క్షణాన
పటలెత్తునో చెప్పలేము.

నిద్రించే జనహృదయం
పిన్నమొన్న మేల్కొన్నది.
అప్పుడె యీనిన బెబ్బులి
అదిపైగా ఆకొన్నది.

బెబ్బులి పెడబొబ్బలతో
తబ్బిబ్బయ్యెను లోకం.
పెను పంజా దెబ్బలతో
విలవిలమనె జంబూకం.

పొంచియున్న వేటకాళ్ళ
మంచెలు ఫెళ్ళున విరిగెను.
నలుదిక్కుల పులిపిల్లల
ప్రళయార్భటి చెలరేగెను.

సౌజన్యానికి ఫలమా
జన్మ నరకమైనప్పుడు;
చైతన్యం కస్సున పం
జా విసరక తప్పదుగా!

ఈజిప్టున ఏమైనది
ఇరాకులో ఏమైనది.
రాచరికం నడుము దెబ్బ
కే చెల్లాచెదరైనది.

జ్వాలాజిహ్వలను సాచి
నీలాభ్రందాక లేచి
జంగసాచి వస్తున్నది
భంగపడ్డ జనహృదయం.

ప్రతి ఎడారి ఎడద విరిసి
పరాగమై ఎగిసెనురా
ప్రతి 'కజ్జూరచెట్టు' విజయ
పతాకమై మురిసెనురా.

ఇసుక నిండినట్టి బ్రతుకు
ఓయసులందు ఈనాటికీ
కండెన చుక్కే భాగ్యం
కలిగిందిగదా తండ్రీ.

అరేబియా జాతులకీ
ఇరాను నేర్పిన పాఠం.
రాజకీయ రంగాన ఖు
రానుకు నూతనపీఠం.

జనహృదయం ఇంతటితో
చల్లారినదా? లేదే.
రేపో మాపో లెబనానున
రెచ్చిపోక తప్పదులే.

ప్రక్కయింటి జోర్డానును
పట్టుక వ్రేలాడుతున్న
పొగచూరిన రాచరికం
పుటుక్కనక తప్పదులే.

ఖర్జూరస్వామ్యజాతి
కాలంతో కేలుగలిపి
ఇసుక దిబ్బలను పచ్చల
మిసిమికలల నిల్పునులే.

నెత్తురు లొల్కిన నేలలు
అత్తరులను చిల్కునులే.
గుండులు ప్రేలిన వాడల
గుండెలు పయనించునులే.

ఇది ప్రజకూ కవికీగల
ఎద బంధంరా తమ్మీ
మధువాసితమైనా యిది
మట్టిపాటయే సుమ్మీ.

29 జూలై 1958

# క ణ్వ యో గి

వేల వత్సరము లాకుల
వోలె దొర్లిపోయినంత
మళ్ళీ ఒక కణ్వయోగి
మన భూమిని అవతరించె.

అతడు జనసమాజమ్ముల
కవల నిల్చువాడుకాడు.
ఐన నతడు కణ్వయోగి
అచ్చమైన కర్మయోగి.

అతని వచస్సులలో ఆ
ర్షతపశ్శక్తులు పండెను.
అతని చూపుసీడల ది
వ్యత్వము కాపురముండెను.

మానవ రుధిర లిలీక్షు
మతులాతని కిసలాంగు
ళ్యంచలముల తాకిడిచే
అమృతాత్మకులై పోయిరి.

బహుచిత్ర; మ్మతని గాలి
పర్వగనే సింగమ్ములు
ఏనుగులకు స్వాగతమిడి
'ఇష్టాగోష్ఠు'లు జరిపెను.

పెనుడేగలు పావురాళ్ళ
గని వాటిని చేరదీసి
బుట్టుదువ్వి మెలమెల్లగ
జువ్విపండ్లు దినిపించెను.

కారడవిని తపోవనము
గా మార్చిన కర్మయోగి,
కణ్వయోగి గాక వేరు
గా తలచుటకేది తీరు ?

స_త్త్వమ్ములలోన స్నేహ
తత్వమ్ముల పిండువాడు
యోగిగాక పైవేసపు
జోగి యోగి యగునామరి ?

మన భూమిని మెట్టిన సా
మాన్యుడతడు మాన్యుడతడు
భౌతికలోకములోనే
బ్రహ్మత్వము జూపెనతడు.

మనిషికి మనసుకు జరిగిన
ఘనసంగ్రామంలోపల
మనస్సుకే దిగ్విజయ
మ్మని చాటిన ధన్యుడతడు.

3 ఫిబ్రవరి 1954

# వర్షాసుందరి

ఎండవలె పండిపోవు రాకేందువదన
రమ్ము మద్భుజాయుగ పంజరమ్మునందు:
మనకు తొలినాళ్ళ పుల్కరించిన కడింది
మమత లట్టుల నింగిలో మబ్బులూరె.

కొదమలేగలకు పాల్గుడుపగా పరుగెత్తు
ఎండుపొదుగుల ఆలతండలట్లు
పరవాహినుల బదాబద లొనర్పగసాగు
శరసముద్ధుర యోధవరులయట్లు
నిజమహోన్నతకుంభ నిక్షిప్తదానాంబు
గంభీర మత్తేభగణములట్లు
తొడిమపీడనిపూల బిడియంపు బరువుతో
అడుగు మోపెడు కన్నెపడుచులట్లు

విరహిణీ పాండుర కపోల వీధులందు
జీరువారు నీలాలక శ్రేణులట్లు
సరస గమనాలజోడ నాషాఢమాస
వేళలందు కాదంబినుల్ వెడలె నదుగో!

కడలి గుండెలలో గ్రుంకులిడి; పయోధ
నమ్ము గ్రోగొనరించి, లోకమ్ములడుగ
నొక్క త్రుటిలోన సర్వమ్ము పుక్కిలించి
సాగు మేఘాల దెంతటి త్యాగబుద్ధి.

మిట్టలన్ గూడుగట్టిన మట్టినెల్ల
పల్లమున దించి; మిట్టలన్ పల్లములను
ఏకవర్ణమ్ములోన చిత్రించి, సామ్య
వాదపాఠము నేర్పె నీ వాననీరు.

ఇన్ని దినాలు వేరుగ శయించిన
నా చెలి! నిన్ను నన్ను నీ
సన్నని వానగాడుపులు
సన్నిహిత మ్మొనరించిపోయె, లే
కున్న నిదాఘతాపజనితోత్కట
ఘర్మజల ప్రపాతముల్
కన్నులముందరే మన
కగాధ వియోగము కూర్చకుండునా!

తానో అంబరపాలకుండు,
తన కాంతారత్నమో నిమ్నలో
కానన్ నిల్చి తపించు భూరమణి;
తత్కాంతా మనోజాత బా
ధా నిశ్వాసము సోకినంతటనె
సంత్రస్తాత్ముడై మేఘు డౌ
రా! నీరై ప్రవహించి కౌగిలిడు,
చిత్రమ్ముల్ గదా ప్రేమముల్!

సకియ! వసంతకాలము
రసప్రదమందురుగాని నాకు నే

లకొ పెనువాన కొరు
సుఖలక్షితమై కనుపట్టు; మావులన్
పికములు గూసినంత
శ్రుతిపేయతగల్గునె? ఎత్తుమంచెలన్
చికిలి వయస్సు గుబ్బెతలు
చేసెడు అల్లరిచేష్టలన్ వినా!

ముందుగ కోడెరైతు
హలమున్ నడిపించగ; వెన్కవెన్క నిం
దిందిరవేణి వాని రమణీమణి
విత్తుల జార్చునట్టి; ఆ
సుందరదృశ్య సంపదను
జూడగ పల్లెల నుండగావలెన్
ఎందుకు పట్టణాల నివసించెడు
కృత్రిమమైన కామనల్.

మిత్తల నెత్తి నెత్తుకొని
దూరపు చేలకు గాలితోడ ప
ర్వెత్తెడు కాపుభామలకు
వేగముగా పయనించు మేఘసం
పత్తికి నెంతసామ్య;
మిసుమంత విభేదమదేదియుండినన్
మొత్తముపై పయోధర
సమున్నిమిషితాంగులుగాదె యిర్వురన్.

కడచిన వానకాలమున
        గాదటె; యుర్వర గుండెపాదులన్
పొడిచిన మవ్వపువ్వులపు
        మొల్క గుబుల్కొని పల్కనేర్వ దుం
దుడుకుతనంపు శైశిరుడు
        ధూర్తుడు గ్రీష్ముడౌనప్పు డాడులన్
వడకెనుగాని నేటి పులివానల
        రెమ్మలు వైచులే చెలీ!
జలదవేణివి, సరికదా! జలదహృదయ
మెట్టులబ్బెను నీకు? కాసింత సేపు
కన్ను చాపైతినా అశ్రుగంగలూరు.
కాన విన్పించినాడ మేఘాలపాట.

—న్ 1954

# ఉదయోన్మాదులు

(గోవా విముక్తికోసం జైత్రయాత్రసాగించిన భారతవీరుల నుద్దేశించి)

పశ్చిమ దిగ్గలధిగర్భ
పంజరాన కట్టువడిన
భానుమండలోద్ధరణకు
బారులుగా పరువెత్తిరి.
అదుగో ఉదయోన్మాదులు
అంధతామస విరోధులు.
గుండెలలో ధైర్యసుధా
బాండమ్ముల పదిలపరచి
కన్నులలో రోషాగ్నిశి
ఖాదీప్తుల గుప్తపరచి:
చేతులందు విజయవర్ణ
కేతనాల నెగురవేసి
సత్యాగ్రహసాధనలో
సర్వస్వము ధారవోసి;
ముందుకు పడిపోయిరదో
మొనదీరిన ఘనయోధులు
యోధులు ఆశావాదులు.
కత్తిముక్క లేక రిపుల
కడతేర్చగ నెంచినారు.
చండులేకయే పగతుర
చెండాడగ దలచినారు.
చిరునవ్వులతోడ మృత్యు

సీమనడుగు పెట్టినారు
పొరుగువారి ముక్తికై
బరిగత్తుల నడచినారు.
వారి వజ్రసంకల్పం
బెరువోవదా కల్పం.
వారిలోన నెత్తురు పొం
గారెడు యువకులే కాదు
తల ముగ్గిపోయిన వృ
ద్ధ సేనాపతులు కలారు.
వారిలోన కండలు జిగి
వారిన పురుషులే కాదు
అబలలుగా అణచబడిన
అంగనామణులున్నారు.
వారిలోన సర్వోదయ
వాదులతోపాటు సామ్య
వాదులు కలరెల్లరు స్వే
చ్ఛోదయమును కోరువారు.
మస్తకములు పగిల్చినను
మడమలు వెనుకకు త్రిప్పక
మానహరణములు జరిపిన
గాని సుంత భీతిల్లక
పరంపరగ అగ్నివృష్టి
కురిపించిన పిరుదివియక;

సేరధివలె ఉప్పొంగిన
నియంతృత్వదుశ్శక్తిని
అమాంతముగ మ్రింగివేయు
అగస్త్యులైనారు వారు.
అగస్త్యులైనారు వారు
అజేయులై తీరుతారు.

1956

# ఆశయసిద్ధి

(ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో వ్రాసినది)

తెల్గుతమ్ముడా నేటిపూట అం
దింతు నీకు ఒకమాట.
వెల్గు నెన్నుడుల పేర్చికూర్చి అ
ర్పింతు నీకు ఒకపాట.

గగనపుష్పమనుకొన్న రాష్ట్రమడ
వనులముందు వికసించె.
శశవిషాణమనుకొన్న ఆశయం
విశాలాంధ్ర సిద్ధించె.

ఈ విశాలతను కేవలమ్ము స్థా
నీయమంచు అనుకోకు.
ఇన్నినాళ్ల అనుకున్నచో విమూ
లించు కించపడబోకు.

ఈ విశాలత మరేడ యందువా?
ఇది మనోగతము సుమ్మా
ఇది అసూయలకు ఇద్ది మాయలకు
ఎన్నొమైళ్ళ దూరమ్మా.

దేశమందు ఎందేనిలేని వి
ద్వేషమేల ఈ నేల?

ఒకని ఉన్నతిని చూడలేని కను
బూడకున్నవవి యేల ?

ప్రక్క యింటిలో పండుగైనచో
ముక్కు విర్చుకొనువాడు;
ఎంత తొందరగ అంతమొందితే
అంత మంచిదీనాడు.

పాత రీతులను ఒక్కమారు సం
ప్లావితమ్ములుగ జేసీ—
నీతులన్నిటిని ఉతికివేసి గుం
డీయల చుట్టుకై సేసీ;

భూతకాలమను గోతిద్రవ్వి గుణ
శాతకుంభమును దీసీ
నేటి కాలమను నీటమున్గి మం
చి ముత్యమ్ములను దీసీ;

తమ్మిపూవులను, తుమ్మపూల నొక
దండలోని కెక్కించీ
వీధిమానిసికి సౌధవాసికీ
భేదభావమును త్రుంచీ.

తెల్లవారు మనగల్గినప్పుడే
వెల్గు నాంధ్రదేశమ్ము.

**88**

అపుడె సార్థకమ్మాంధ్రులందు షాం
గారు అభినివేశమ్ము.

నవంబరు: 1956



# కవి

ఇంద్ర ధనువునుండి ఒక్క
యింత వన్నె స్వీకరింతు.
చిరుతారలనుండి కొంత
జీవకాంతి దొంగలింతు.

చంచలాలతికనుండి ర
స స్పందనమడిగి కొందు.
మధుమాసమునుండి కొంత
మత్తు కొల్లగొట్టుకొందు.

గ్రుడ్డి జవ్వనమ్ము నడిగి
కొందు కొంత బిబ్బోకము
ఉన్మాదము పెంచు అంద
మొసగె కొంత హేవాకము.

చెదరిన కిరణమ్ముల కన్
తుదల నేరుకొని తెత్తును.
బెదరిన స్వరములను గూర్చి
హృదయగీతి నిర్మింతును.
స్వర్గస్మృతిలో కూర్చొని
చక్కని మూర్తిని మలతును.
మొండిరాతిలో సైతము
గుండె చప్పుడును కూర్తును.

(మఖ్దూమ్ మొహియొద్దీన్ 'షాయర్' గీతానికి అనువాదం)

9 ఆగస్టు 1956

# లో వెల్గులు

ఈ వెల్గులు త్రపాఘుస్మృణ హిండితములు; ఈ వెల్గులు
వరస్మేరకపోల చంద్రకితమ్ములు చకితమ్ములు.

ఇవి కజ్జలముగ్ధపక్ష్మ వివృతరాగభాష్యమ్ములు
సూక్ష్మెరుగని సింగిణీ రంగుల పుల్గులు ఈ వెల్గులు.

చంచలరజనీ రమణీ చరణ కింకిణీ కృతములు
ఎంత కనులు మూసికొన్న అంతగ కన్పడు వెల్గులు.

సద్యోవికచదవాగ్ని జ్వాలాదళ బాంధవములు
మండినంత సేపు గంధమాధురు లిచ్చెడి వెల్గులు.

మస్తిక విస్యస్త హస్త మర్యాదుని అంటుకొన్న
పంటితుగలదాకవచ్చి వెంటనే అదృశ్యములగు.

చింతాదంతురిత మనస్వీముని కంటి ఊహలకు
త్రుటికాలము తటిల్లతలతో వియ్యము జరిపించును.

ఇంటిని ఒంటిని మరచిన యినుప కచ్చడముల వారి
కే కొంతకుకొంత కానుపించి వెర్రియెత్తించును.

ఇట్టికొంటె వెల్గులు సంధృత బహురూపమ్ములు నా
కెట్టుల—ఈగాజుకనుల కెట్టుల—గోచరమయ్యెను.

శబలిత గాఢచ్ఛవి ప్రసన్నములు రసస్విన్నము
లీ వెల్గులు కాబోలును లోవెల్గులు—ఏమోమరి!

# 91

లోవెల్గులు చూడగల్గు జీవులెవ్వారి కాలము :
అవునో లోవెల్గుల ఛాయాక ప్రతిబింబములివి.

21 నవంబరు 1958



# కొన్ని ప్రసిద్ధ రచనలు



| | | | |
|---|---|---|---|
| కోనంగి | (నవల) | అడివిబాపిరాజు | 5-00 |
| అంజలి | (కథలు) | ,, | 1-50 |
| తరంగిణి | ,, | ,, | 1-50 |
| రాగమాలిక | ,, | ,, | 1-50 |
| బాపిరాజు కథలు | ,, | ,, | 6-00 |
| ఆరుద్ర కథలు | ,, | ఆరుద్ర | 3-00 |
| త్వమేవాఽహం | (కావ్యం) | ,, | 1-50 |
| అమృతాభిషేకం | ,, | దాశరథి | 1-50 |
| ఆనందచేతన | ,, | కె. రామకోటిశాస్త్రి | 1-00 |
| మధుమాసం | ,, | క. పాండురంగశర్మ | 0-50 |
| కాంతిచక్రాలు | ,, | ఉండేల మాలకొండారెడ్డి | 1-50 |
| పూలరాశిలో కారుచిచ్చు | (నవల) | దివ్యప్రభాకర్ | 3-00 |
| సమర్పణ | ,, | సీతంరాజు | 2-00 |
| నిరుద్యోగి | ,, | మురళీకృష్ణ | 2-50 |
| విశ్వభారతి | ,, | పోణంగి శ్రీరామఅప్పారావు | 1-50 |
| పునరాగమనం | ,, | ఘట్టి ఆంజనేయశర్మ | 2-50 |



: జీవిత విశేషాలు :

జననం:

ప్రజోత్పత్తి ఆషాఢ పూర్ణిమ

జన్మస్థలం:

హనుమాన్ పేట,

కరీంనగర్ జిల్లా

ఉద్యోగం:

ఆంధ్రోపన్యాసకులు,

నిజాం కళాశాల, హైదరాబాదు

ప్రాచీన కావ్యాలలోని వస్తువిన్యాసం, భావ కవిత్వంలోని శబ్ద విన్యాసం, అభ్యుదయ కవిత్వంలోని సందేశం, తగిన పాళ్లలో మేళవించు కున్న రచనామార్గం వీరిది. వీరు తొలుదొల్త విరివిగా వృత్తాలు వ్రాసే వారు. వీరి వృత్త రచనా నైపుణికి జలపాతంలోని పద్యాలు సాక్షులు. క్రమంగా గేయరచనవైపే వీరి కలం మొగ్గు చూపింది. గేయాన్ని నియమ బద్ధంగా, పద్యమేమో అనే భ్రాంతి కలిగించేట్టు వ్రాసిన అధునిక కవులలో వీరు గణనీయులు. అసలు మాత్రాచ్ఛందస్సులో కథావస్తువు, పాత్రలు, సన్నివేశాలు మొదలైన వాటిని సమకూర్చుకొని పెద్దకావ్యాలు వ్రాసిన వారిలో వీరు అగ్రగణ్యులు. నాగార్జునసాగరం, కర్పూర వసంత రాయలు, విశ్వనాథనాయడు వీరి కావ్యాలలో కొన్ని. నవ్వని పువ్వు, అజంతాసుందరి, వెన్నెలవాడ వీరి గేయ నాటికలలో ఎన్నదగినవి.

కవి కావడంకన్న మనిషికావడం గొప్ప అని విశ్వసించిన భావుకులు వీరు.

'ఇరుగుండియ లోకనూత్నపు
విరులై కలిసినచాలును
పొంగి నింగి నందుకొందు
భూదివమ్ము లతికినట్లు'

అన్న స్నిగ్ధ హృదయులు వీరు.

WRAPER PRINTED AT SRI SARADA PRESS, VIJAYAWADA-2